# శంకరాద్వైతం



త్రిపురనేని వెంకటేశ్వరరావు



నవోదయ పబ్లిషర్స్
విజయవాడ-2.

అమరుడు - మిత్రుడు

## గంటి రాజేశ్వరరావుకు

ఓ మానవోత్తమా! ఓ మానుషకీర్తి!
ఓ స్నేహకాహళీ! ఓయి రాజేశ్వరా!

నీ హృదయగుహాలోన
సౌహృదస్మె దివ్వె—

నీ జీవిత ప్రబంధ
ముత్సాహ ఛందమ్ము—

హాసరోచి జీవని
శాసనుని నిన్నలమి
సంతోషమే నీకు
సగము బలమైనిండి
విద్యుత్తేజమా
వేశించు బోధినై
నాగావళీ తటుల
నా బ్రతుకు లోవరచి
కరడెగసి కదలికై
కదలిన నాజీవన
సగస్సైతియు నెడారి
పొరదవిలి చెల్వడిన
ఈ నాటికో మాకు
[illegible]

అమరుడు - మిత్రుడు

# గంటి రాజేశ్వరరావుకు

ఓ మానవోత్తమా! ఓ మాధుర్య ఝరీ!
ఓ స్నేహకాహళీ! ఓయి రాజేశ్వరా!

నీ హృదయగుహాలోన
సౌహార్దమ్మే దివ్వె —
నీ జీవిత ప్రబంధ
ముత్సాహ ఛందమ్ము —

హాసరోచి జీవని
కాసనుని నిన్నలమి
సంతోషమే నీవు
సగము బలమైనిండి
విద్యుదుత్తేజమా . .
వేశించు బోధినై
నాగావళీ తటుల
నా బ్రమను లోపరచి
కరడెగసి కడలినై
కదలిన నాజీవన
సరస్వతియు నెడారి
పొరదవిలి చెఱపడిన
ఈ నాటికో మాను
[illegible]

అరవిరియు నా బ్రదుకు
టలుకు తలిరు ఔడంద
పురుగాహరించుకొన
విరివికసనలు లేని
ఈ నాటికోమారు
ఈవు నాలో విరిసి——

అష్టవర్షీయ మవు
తరుణ ప్రాణుణ్యమ్ము
సురభీ కరింపురా
సుధాస్నవ మిమ్మురా
ఓ, మానవోత్తమా! ఓ మాధురీ ద్యుతి!

అందుకో స్మృత్యంక
మందుకో యీ పూవు
అందుకొని మననెయ్య
ఘనార్తవ మనుమురా!!



# ఒక సమీక్ష

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారి "శంకరా ద్వైతం" అనే వ్యాసము అవశ్య పఠనీయము. వీరి వాదాలు అప్రతిసమాధేయాలు కాకపోయినా, వీరు శ్రీ శంకరాద్వైత సిద్ధాన్త విషయములు నన్నిటిని విమర్శించుటకు తీవ్రముగ కృషిచేసినారు. భాష్యములను విమర్శనా దృష్టితో చదివినారు. మొదటి పర్యాయము వీరి వ్యాసము చదివినపుడు, సామాన్యముగ, వీరి వాదము లన్నియు సమంజసములేయను నూహ పాఠకులకు తప్పక కల్గును – ఆయా వాక్యముల సందర్భములను; అచటి వ్యాఖ్యానములను, వాదగ్రంథములను చూచినచో, వీరి యుక్తులకు సమాధానములు లేకపోలేదు–కాని వీరి భాష్య పరిశ్రమ మాత్రము పాఠకుల నాశ్చర్య చకితుల జేయును.

కృష్ణా పత్రిక
(1958 జూన్ 14 సంచిక)

# నివేదనం

"భారత తత్త్వశాస్త్రపరిశీలన" అన్నది నాపూర్వ రచన. ఇప్పటికీ రచన దానికనుబంధము. పరిశీలనలో నే వెల్లడించిన అభిప్రాయములపై కొన్ని శంకలు, విమర్శలు వచ్చాయి. అందులో ఆత్మభావం, బౌద్ధమైన వాదాలలో గల గతితార్కికం, అద్వైతం గూర్చి చెప్పిన నా భావాలు వివాదగ్రస్తాలయ్యాయి. ఆత్మభావమును విషయంలో నే చేసిన తీర్మానం నేను నమ్మిన భౌతికవాద మూల సూత్రాలకే విరుద్ధమైనదని, పరిశీలన పేరిట మూల సూత్రాలను తిరుగదోడుటకు యత్నించినట్లున్నదని మిత్రవర్గాలు ఆందోళన చెందాయి; అలాగని వ్రాశాయి. అందుచేత ప్రత్యేకంగా ఆవిషయాన్ని చర్చించడం అవశ్యమైంది. ఆత్మభావము–దాని పుట్టు పూర్వాలు అనే పేర సమగ్రమైన రచన చేయవలెనని సంకల్పించి సేకరణ సాగించాను. ఇంతలో మిత్రులు తాత్త్విక గోష్ఠులు ఆరంభించారు. గోష్ఠికి వ్రాయవలసివచ్చింది. పునర్జన్మ, మోక్షము, పరలోకాలు, కర్మవాదము, నీత్యవి నీతులు–ఆత్మభావంతో పెనగొనివున్న యీ విషయాల పుట్టు పరిణామాలను గూర్చి తలపెట్టకుండా ఆత్మభావమును గూర్చి సూటిగా వ్రాసి ముగించక తప్పినదికాదు. వచ్చిన విమర్శను సరిపడునట్లు వ్రాసి స్రాయకున్నాను. అద్వైతం విషయంలో తాత్త్వికాంశాలను మాత్రం విరివిగా చర్చించాను. సామాజిక పరిస్థితులను, ఫలితాలను ప్రస్తావించలేదు. ఇవి రెండూ వ్యాసరూపంలో 'సందేశం' పత్రికలో వెలువడి వున్నాయి.

విజయవాడ, పెద్దాపురంలో జరిగిన సమావేశాల్లో చర్చకు వచ్చివున్నాయి. కొద్ది మార్పులతో ప్రస్తుత రూపంలో యిప్పుడు సంతరింపబడుతున్నాయి.

జైన వాదములో గతి [illegible] దృష్టి [illegible] విమర్శకులు నేడు గ్రహిస్తున్నారు. [illegible] నా వాదనకు భిన్నముగా బలమైన వాదనలు రాలేదు. అందుచే వానిని గురించి ప్రత్యేకించి వ్రాయలేదు.

విమర్శ-ప్రతి విమర్శల లోనే సిద్ధాంతాల శంకలు దీరగల్గుతుంది. ఉదాత్తమైన వాద ప్రతివాదాలే ఏ వాదానికైనా సిద్ధాంతపథం. ఏమైనా తెలుగువాట ఘంటాకర్ణులు చెవిగంటలు విప్పుకోవలసి వస్తున్నట్లున్నది. విభిన్నాభిప్రాయాలు ఒకేవేదిక ఎక్కుతున్నాయి. నవీన తనానికి, విసుర్లకి, చమత్కారాలకి, [illegible] కాలం చెల్లుతోందనిపిస్తోంది. దృక్పథభేదానికి సహజసౌజన్యాలను బలిపెట్టవలసిన స్థితి సడలుతోంది. ఘోషఘర్షణ కల్లోలము కాకుండ అదొక సదవకాశముగా మార్చుకొనుట సంస్కారమున్నందుకు ఫలంగానాలని నా అపేక్ష. అలా విమర్శలు సాగుతాయని ఆశ.

ఆంధ్రలోకం నా పూర్వరచనని ఆదరించింది. అవే ఆదరాభిమానాలు యీ రచనపైనా ప్రసరించగలవని విశ్వాసం.

—రచయిత

of religon was the belief in spirits which take up their abode from time to time in various forms. It cannot have been until long experi - ence that the idea of a disembodied spirit can have been intelligible. Primitive man must long have regarded body and mind as one "—Introduction to Aitareya Aranyaka (By A. B. Keith.)

దేహంతో అవినాభావసంబంధంలేని ఆత్మవంటిభావం ఆదిమంగాదని, దేహేతరమైన ఆత్మభావం పూర్వమానవుని కర్థంగావడమన్నది దీర్ఘానుభవంమీదగాని సాధ్యపడదన్నదే పైవాక్యాల సారాంశం తొట్టతొలుత మానవుడు మనోదేహాలను ఏకీకృతంగానే విశ్వసించాడన్నదే యీ వాదం. అసలు జడపదార్థాలను అర్థంచేసుకోనేలేదని, సర్వవిషయాలకు కృపా కోప ద్వేషాదులవంటి మానసిక లక్షణాలను గలవిగా చూశాడని తాత్పర్యం. జడ, చైతన్యాలు విభిన్నమనే 'ఉన్నత' జ్ఞానస్థాయిని దేహేతర ఆత్మభావం సూచిస్తుందని అనబడిందన్నమాట.

ఈ వాదన తార్కికంగా సత్యమని స్ఫురింపజేయినప్పటికీ వాస్తవ పరిస్థితులను గమనికలోకి గైకొన్నట్లయితే సత్యసామీప్యత లోపిస్తోంది. నేడున్న ఆటవిక తెగలలో యీటువంటి నమ్మకం కానరావడం మృగ్యం. పైగా కలలు జంతుజాలానికి సైతం వస్తాయని మానసిక శాస్త్రవేత్తల అనుభవం చెబుతోంది. అందుచేత వానరం మానవ మస్తిష్కాన్ని సంపాదించేసరికే స్వప్నానుభవం ఎంతో వుండగలదనడం స్పష్టం. ఏమాత్రం ఆలోచించడానికి అనుకూలించే అంగంగా వానర మస్తిష్కం వృద్ధిపొందినా యీ విశ్వాసం నెలకొనడం విశేషం

గాదు. పైగా యీ ద్వైతభావానికి ముందు ఆత్మ, మనోవ్యాపా
రాలకు దేహంతో గల సంబంధం తెలియకున్న ఆ సమస్య తట్టడానికి
వీలుగలస్థాయి అతని కెక్కడ లభిస్తుంది?

ఈ వివాద పర్యవసానం ఎలా తేలినప్పటికీ మన ప్రస్తుత పరిశీలనకు, నిర్ణయాలకు నిమిత్తం వుండదు. ద్వైతభావానికి ముందొక దశ వున్నదా, లేదా అన్నదే యిందులోని మీమాంస. కాని ప్రస్తుత అవలోకనంలోని వుద్దేశం ద్వైతం ఏర్పడ్డాక, ఆ ద్వైతంయొక్క స్వభావం ఎటువంటిదో కనుగొనడమేగదా!

(3) ఆటవికుల ఆత్మభావాలను అతిసూక్ష్మంగా అధ్యయనంచేసి మానవశాస్త్రం, తత్సంబంధ సిద్ధాంతాలనుకూర్చి ఒకానొక స్థూలాభిప్రాయాన్ని వెలువరించింది. దానిని టైలర్ మహాశయుని వాక్యాలలో కనుగొందాము.

"It is a thin unsubstantial human image, in its nature, a sort of vapour, film or shadow".

"Among rude races, the original conception of the human soul seems to have been that of ethereality or vaporous materiality, which has held so large a place in human thought ever since." page 457.

ఆత్మ మానవాకృతిలో వుంటుందని, దాని స్వభావం సూక్ష్మవాయుకద్రవ్యత్వమని దీనిభావం.

"As souls appear in dreams and visions, they were thought to possess thin bodies to be visible, to be moving, to be speaking".

దీనివల్ల ఆత్మలు సూక్ష్మశరీరమని సైతం తేల్చబడింది. ఆత్మకు, నీడకు (ఛాయకు)-ఆత్మకు, వూపిరికి అనేక భాషలలో ఒకేవొక శబ్దం శ్లేషార్థాన్ని కలిగి వుండడాన్ని పుష్కలంగా గమనిస్తాము.

| భాష | శబ్దం | అర్థాలు |
|---|---|---|
| 1. అరవాక్ | 'యువిజ' | ఛాయ, ప్రతిబింబం, ఆత్మ. |
| 2. అబిపోన్సు | 'లోయకల్' | పైమూటితోపాటు ప్రతిధ్వని అనేది అదనపు అర్థం |
| 3. జూలూస్ | 'టుంజి' | ఛాయ, ఆత్మ |
| 4. బసూటోస్ | 'సెరిటి' | " " |
| 5. 'క్విచే' | 'నటుబ్' | " " |
| 6. 'అల్గాన్‌క్విన్స్' | 'ఓటహ్‌చుక్' | " " |
| 7. పశ్చిమాస్ట్రేలియన్ | 'వంగ్' | ఊపిరి, ఆత్మ |
| 8. 'నెటెలా' (కాలిఫోర్నియా) | 'పియుట్స్' | " " |
| 9. 'జావానీస్' | 'నవ' | " " |
| 10. 'హిబ్రూ' | 'నెఫెష్' | " " |
| 11. అరబిక్ | 'నెఫ్స్', 'రుహ్' | " " |
| *12. గ్రీకు | 'సైక్', 'న్యూమ' | " " |
| *13. లాటిన్ | 'యనిమస్', 'యనిమ' 'స్పిరిటస్' | " " |

*14. స్లావోనిక్ 'దూచ్' " "
*15. జర్మన్ 'జీస్ట్' ) ఇవి అసలు శ్వాసనే
16. ఇంగ్లీషు 'ఘోస్టు' ) అర్థాన్ని కలిగివున్నాయని విజ్ఞులు తెల్పారు.
*17. 'జిప్సీ' 'దూక్' ఊపిరి ఆత్మ

ఆత్మను శ్వాసవాయువుగా భావించడం ప్రపంచంలో చాలచోట్ల. అది పునాదిగా అనేక ఆచారాలు రూపొందాయి. చనిపోతున్న వారి ముఖంలో ముఖం పెట్టించి పసిపిల్లలచేత వారి శ్వాసాన్ని పీల్పించి తద్వారా పిల్లల్లో ఆత్మ ప్రవేశించిందని సంతోషించే నమ్మకం ప్లాటివా 'సెనెక కలుస్' తొలి మొదలు నాగరిక రోమన్ జాతివరకు వుంది. మన దేశంలో తుమ్మినప్పుడు 'కృష్ణ' అంటాము. బౌద్ధ గ్రంథాల్లోకూడా తత్ప్రసక్తి కద్దు. ఉపన్యసిస్తుండగా బుద్ధునికి తుమ్మువచ్చింది. వింటున్న శ్రోతృలోకమంతా 'జీవ, జీవ'♦ అని ఉపశాంతి పదాలు ఉచ్చరించారు. బుద్ధు డదిచూసి ఆ అలవాటును, దాని వెనుక వున్న నమ్మకాన్ని నిరసించి, వారించాడు. తన పరివ్రాజకులీ అలవాటుకు లోనుగా రాదని నిషేధించాడు. ఇదే అలవాటు రోమన్లకూ, గ్రీకులకూ వుండేది. తుమ్ముల్లో ఎక్కువశ్వాస పోవడమే అందుకు కారణం కావచ్చు.

(4) ఇంతవరకు మానవశాస్త్రంలో ఆత్మభావన పరిణామమైంది. ఇక తత్త్వప్రపంచంలోని పరిస్థితిని పర్యాలోకిస్తాము.

---

* ఆర్యభాషలో ముఖ్యంగా ఆత్మశబ్దం శ్వాసం అనే అర్థాన్ని కూడా కలిగిఉండటం గమనార్హం.

♦ "జీవతుభంతే భగవా, జీవతు సుఖితో" వినయపిటకం.

పాశ్చాత్య తత్త్వకుటుంబాన్ని మున్ముందుగా తీసికొందాము. 'ఎపిక్యూరస్' మహాశయుడు పాశ్చాత్యులకు చార్వాకుడు. కర్తలేని భౌతికవాదిగా ఆయనకు ఎన్నికవుంది. ఆయన ఆత్మ నంగీకరించాడు. అయితే ఆత్మ భౌతిక విషయం గావడం అని వార్యం, ఆవశ్యకం అని వక్కాణించాడు.

"Those who say the soul is incorporeal talk folly, for it could neither do nor suffer anything were it such"

దీనినిబట్టి నాటికే ఆత్మను ద్రవ్యరహితమైన శుద్ధచైతన్యంగా సూత్రీకరించేస్థితి గ్రీకు దార్శనికజగత్తులో ఏర్పడిందనిభావించాలి. అందుకే విశుద్ధచైతన్యమైన ఆత్మ నిష్ప్రయోజక మవుతుందని 'ఎపిక్యూరస్' ఎరుగు. ఆలోపనివారణకు ఆత్మమూలంలోపదార్థం గానిలసివుంటుందని ప్రతిపాదించాడు. భౌతికవాదియైన యీయన ఆత్మనంగీకరించాడన్నది ఆధునికుణ్ణిఆశ్చర్యచకితుణ్ణి గావించవచ్చు గాని, ఏతత్ప్రతిపాదనానంతరం దానిని ద్రవ్యమయంగా వూహిం చాడని తెల్సుకోవడం ఏ విశేషం. ఆయన ఆత్మ శాశ్వతా వాదాన్నికూడా ఖండించాడు. మళ్ళీ ఆత్మ దేహంతోపాటుగా నశిస్తుందని అనలేదు. మరణానంతరం దైహికస్పర్శ ఆత్మకు కొరవడుతున్నందున ఆత్మాణువుల్లో అనుభూతి సంజ్ఞ, జ్ఞానం కలుగనేరక చేతనారహిత మవుతుందన్నాడు. చేతనారహిత మైనది లేనట్లే లెక్క. అగ్ని, శ్వాసల అణువుల కూడిక ఆత్మ. (శ్వాస వాయువుకన్నా భిన్నమంటాడు ఆయన). ఈ అణువులు దేహమంతటా పర్యాప్తమైవుంటా యన్నాడు.

విశ్వపరిణతికి మూలద్రవ్యం వాయువని ప్రతిపాదించిన 'ఎనగ్జమనీస్', ఆత్మనుకూడా సూక్ష్మతమవాయు వన్నాడు. 'స్పిరిట్'(spirit) అనే ఇంగ్లీష్ శబ్దానికి అర్థం సూక్ష్మవాయువే. జగదాద్యపదార్థం 'అగ్ని' అని సూత్రీకరించిన 'హిరాక్లిటస్' ఆత్మను అత్యంత సూక్ష్మమైన అగ్ని అన్నాడు. ఇంగ్లీషు భాషలోని 'క్వింట్ ఎస్సెన్సు' (Quint Essence) అనే శబ్దం కూడా 'హిరాక్లిటస్' మహాశయుని భావననే పాదుకొన్నది. ఆశబ్దం ఆత్మను ఐదవ సారాంశంగా సూచిస్తుంది. చతుస్సారాలు ఆకాశం మినహాగా ప్రసిద్ధమైన చతుర్మహాభూతాలు కాగా, పంచమసారం ఆత్మ - సూక్ష్మతమమైనది.

అయోనియన్ తాత్త్వికుల్లో గణితశాస్త్రాధారిత తత్త్వజ్ఞానం తమ తత్త్వచింతనపై ప్రసరింపజేసుకొన్నవారు 'ఎనగ్జిమాండర్', 'పైథాగరస్' మహాశయులు. వీరు చతుర్మహాభూతాలలో దేనినో ఒకదానిని ఎన్నిక జేసి జగన్మూలద్రవ్యమని నామకరణం చేసే ధోరణికి వేరయ్యారు. గణితస్వభావానికి తగినట్లుగా వస్తు నిర్దేశాన్ని విడనాడి ఒకానొక (abstraction) ను ప్రవచించారు. అందులో ఒకరు మూలపదార్థం 'అనంతం' అన్నారు; వేరొకరు 'సంఖ్య' అన్నారు. ద్రవ్యనిర్దిష్టతను దూరమయ్యే ధోరణిని ప్రవేశపెట్టిన వీరుకూడా ఆత్మను పాదార్థికంగానే ఊహిస్తూ వచ్చారు. ఇందులో 'పైథాగరస్' మహాశయుడు పునర్జన్మలో విశ్వసించినవాడు. ఆయనఆత్మను 'ఈథర్ ఖండము'(chip of the Ether) గా వూహించాడు. ఆయన అవగాహనలో 'ఈథర్' అనగా ఆవిరి. 'ఎంపెడోక్లిస్' అనేఆయనకూడా పునర్జన్మను బోధించినవాడే. ఆత్మస్వభావం విషయంలో ఆయన భావన అక్షరాల 'పైథాగ

రస్'దేగాని భిన్నంకాదు. నాకు అర్హత చాలకపోవచ్చునేమో గాని, ప్రాచీన గ్రీకు మహాదార్శనికులలో పేరెన్నికగన్న భౌతిక వాదులందరూ విస్పష్టంగా ఆత్మభావంలో విశ్వాసమున్నవారే నన్నది సత్యానుమోదమైన విషయంగా చెప్పొచ్చు. బహుశా, దేహాంతరంగా ఆత్మ అంటూ లేనేలేదన్నవారు ప్రాచీన గ్రీకుతత్త్వ ప్రపంచంలో లెక్క కొక్కరుకూడా లేరననచ్చును. అనగా గ్రీకుతత్త్వ శాస్త్రంలో దేహాత్మవాదం లేదన్నమాట.

మరో విషయాన్ని పరికించుదాము. భావవాద చక్రవర్తి అనదగిన 'ప్లేటో' మహాశయుడుకూడా ఆనాటికి ఆత్మను విశుద్ధ చేతనంగా నిర్వచించలేకపోయాడు. "The soul is compounded of tho indivisiblo - unchangoable and tho divisible - changoable; it is a third and intermediate kind of ossonce" -[Russel's Histroy of W. Philosophy]. ఇక గ్రీసులో ఆత్మను, చైతన్యాన్ని విశదీయ ప్రారంభించినవాడు 'అరిస్టోటిల్' మహాశయుడు. ఆత్మ దేహంతో నశిస్తుంది. కాని ఆత్మలో ఒక భాగంలో సంస్థితమైన మనస్సు (Mind - చైతన్యం) మాత్రం మరణించదు. ఆ మనస్సుయొక్క వ్యాపారమేమంటే భావన; గణితాన్ని, తత్త్వశాస్త్రాన్ని సమాలోచించడం; అది అజరామరం. దేహంలోని చలనాలకు, ఇంద్రియ గోచర విషయాలను పరిశీలించడానికి మాత్రమే అయితే అంతవరకు అందరూ భావించిన ఆత్మ సరిపడుతుంది. అది దేహంతో మరణించినా ప్రమాదంలేదు. పాదార్థికమైనది మరణించాలి గదా! అమృతత్వం గావాలంటే భావనాత్మక విషయంగావాలి అన్నతర్కమే 'అరిస్టోటిల్' దృష్టిలో యిమిడి వున్నది.

ఇక మధ్యయుగమంతా ప్లేటో, అరిస్టోటిల్ మహా మహుల ఆత్మభావాలలోని మంచిచెడ్డల ఖండన సంపదలతో యిరువాగులుగా తాత్త్వికులు చీలి సంకుల సమరం సాగించటంలో తెల్లవారింది. చైతన్యాన్ని, భావనను ఆత్మయొక్క సంకుచిత కర్తృత్వంనుండి తప్పించబూనడం పదహారో శతాబ్దంనుండి సాగి, జయప్రదమైంది. ఒకవైపున 'డీకార్టే' ఆత్మను ద్రవ్యరహితమైన దానిగా పోతబోశాడు. నాటినుండి ద్వైతం స్థూల సూక్ష్మద్రవ్యాల మధ్యగాకుండా విశుద్ధచేతనం, ద్రవ్యాలమధ్యకు రంగస్థలాన్ని మార్చుకొన్నది.

(5) పైవన్నీ ప్రాచీనతాత్త్వికుల అభిప్రాయాలు. ఆ ప్రాచీనుల భావజాలంపై అధునాతనులైన తత్త్వచరిత్ర శోధకుల కొలగారం నడచిన తీరుతో పరిచయం పొందడం శ్రేయస్కరం. కాని సంక్షిప్తమైన, సవిమర్శకమైన చక్కని రచన ఒకదానినుండి ప్రస్తుతం పొందుపరుస్తాను. 'రస్సెల్', 'లీవిస్' (Lewis, G. H.) 'బర్నెట్' వంటివారంతా యిదే ధోరణిని అనుసరించారని ఒక మాట చెప్పదలచాను.

"పూర్తిగా అధునాతనార్థంలో కాకపోయినప్పటికీ, సోక్రటీసుకు మున్నటివారందరూ ప్రధానంగా భౌతికవాదులు. జీవద్రవ్యానికి, నిర్జీవద్రవ్యానికి మధ్యవారెట్టి విస్పష్టమైన భేదాన్ను చూడలేదు; కాని ఆత్మ ద్రవ్యమయ విషయంగానే విశ్వసించబడింది." – 26.వ పేజీ.

"గమనించవలసిన రెండో విషయమేమంటే యీ గ్రీకులందరూకూడ భౌతికవాదులే. ద్రవ్యరహితమైన దైవాన్ని

గూర్చిగాని, ద్రవ్యరహితమైన ఆత్మ, శక్తులను గూర్చిగాని వారికొక అభిప్రాయమంటూ ఏర్పడనేలేదు."– 20 వ పేజీ.

"ఆత్మలు, దేవతలతో సహా జగత్తంతా కాల ప్రదేశ గతమైవుండే వొకేవొక పదార్థం (Substance)తో నిర్మించబడివుంది. ఆ పదార్థం ద్రవ్యమయం (Material)".– 22, 23 పేజీలు.

(From Philosophy for Pleasure, by Hector Hawton.)

నాకు తెలిసినంతలో క్లుప్తమైన యీ అంచనాలు పాశ్చాత్యతత్వ చరిత్రకారులలో నిర్వివాదమైనవి. ఈ విషయంలో (శ్రీ) హాటన్ కొత్తదనంకై పరుగెత్తిందిలేదు. * ఇంతటితో పాశ్చాత్య దార్శనికపరిశోధనా పరిశీలనను ముగించబోయే ముందు ప్రస్తావించిన విషయ సారాంశాన్ని క్రోడీకరించుతాను. ఆత్మభావం జననములో, శైశవములో ద్రవ్యాత్మకంగా ముగ్ధంగా ఊహించబడింది. బాల్యావస్థనుండి క్రమంగా యౌవన ప్రాగల్భ్యాన్ని వడసింది. ద్రవ్యరాహిత్యంతో ప్రౌఢిమను సంతరించుకొన్నది. ఈ ప్రౌఢిమకు సురపుఠాని మచ్చగా ద్రవ్యాత్మక దేహంతోడి సంబంధ, సంపర్కాలు అనివార్యమై మిగిలి కలవరపరుస్తుంటాయి. కాని, ఆ ప్రౌఢాత్మ తనలోని సకలాన్ని మరచి గురివెందగింజలా నంగనాచి బ్రదుకును వెళ్ళమార్చడానికి సదా యత్నంలోనే వుంది.

---

* మార్క్సిస్టుదార్శనికులు ప్లెఖనోవ్, బుఖారిన్‌లుగూడా యిదే అభిప్రాయాన్ని అభివ్యంజనం చేశారు.

(6) ఇక ఈ నేపథ్యభూమికను విరమించి. భారతీయ తాత్త్విక రంగస్థలంమీద యవనికను పైకెత్తేదాము. ముందుగా శ్రీ వివేకానందస్వామిని ప్రవేశపెట్టడం సుప్రారంభమవుతోంది. భారతప్రతిభ మూర్తీభూతమైన మహాపురుషుడుగా యీయనను పరిగణనకలిగింది. ఈయన అద్వైతప్రవక్త. పశ్చిమఖండాలకు ప్రయాణించగలిగినందున వారి భావనా వాహికల వొడ్డులపై నడచుట తటస్థించినది. ఇది వీరి రచనా, ప్రసంగాలనుండి గ్రహించగలం. 'ఆత్మస్వభావం-దానిగమ్యం' (Nature of the Soul and its Goal - Vol. Vl, Works of Vivekananda.) అనేవాకవ్యాసాన్ని గమనించవలసివుంది. అవ్యాసంలో ఈజిప్షియనుల ఆత్మభావాలుకూడా అవలోడన చేయబడ్డాయి. ఈజిప్షియనులు దేహపతనానంతరం ఆత్మ కొంతకాలం మనుగుతుందని. దేహంగాయపడినా క్షతమైనా ఆత్మకూడా అలాగే క్షతమవుతుందని విశ్వసిస్తారని అన్నారు. "ఇక ఆర్యభావనను గమనించుదాం. ఒక్కమారుగా మనకోపెద్ద తారతమ్యం కానవస్తుంది. ఇక్కడ కూడా ఈజిప్షియనుల ఆత్మవుంది, కాని అనేక భావనాత్మక శరీరంగా (Spiritual body) వుంటోంది." ఈవిధంగా భారతీయుడుగా ఆనవాయితీగా స్వామీజీయనవచనాలు చదివిన తర్వాత వాస్తవస్థితిని చిత్రిస్తాను.

"ఈజిప్షియనులలో వున్నటువంటి ఆత్మభావన అతి పురాతన యుగంలో ఆర్యులు తమంతతాముగానే కలిగి వుండడానికి, లేదా కలిగి వుండొచ్చుననడానికి బాగా అవకాశంవుంది. అత్యంత

పురాతనమైన వారి ఆధారాలను అధ్యయనం చేసినట్లయితే ఈ అభిప్రాయముంపడానికిగల అవకాశాన్ని పరికించగలం. మానవుడు మరణించినపుడు ఆత్మ పితరులమధ్య నివసించడానికి వెళ్ళిపోతుంది. అక్కడ పితరుల సుఖాలను అనుభవిస్తూ జీవిస్తుంటుంది."

"అనంతర మీ భావన ఉన్నతపథాల కందుకుంటుంది. అంతకుముందు వారు ఆత్మ అనుకొన్నది వాస్తవంగా ఆత్మకాదని తెల్సుకోసాగారు. ఈ తేజశ్శరీరం, సూక్ష్మశరీరం - ఎంత సూక్ష్మాతి సూక్ష్మమైనదైతేనేమి? అదీవొకశరీర (Body)మే; శరీరమన్నది స్థూలమో సూక్ష్మమోగాని ద్రవ్యరాశితో తయారైయుండేతీరాలి. స్వరూపమో, ఆకారమో గలదల్లా పరిమితమైనదిగావాలి; శాశ్వతం గాజాలదు. స్వరూపమున్నదానిలో పరిణామం నైజధర్మంగా వుంటుంది. పరిణామశీలమైనది శాశ్వతమెలా కాగలుగుతుంది? ఈ ఆక్షేపణతో యీ తేజశ్శరీరాన్ని అలాగే వుంచి దానివెనక మానవుని నిజమైన ఆత్మను కనుగొన్నారు ... ఆ విధంగా అసలు ఆత్మభావన ప్రారంభమైంది." (18 వ పేజీ, వివేకానంద గ్రంథావళి, ఆరోసంపుటం.)

ఆత్మభావాన్నిగూర్చి భారతార్యుని మేధః ఫలకం మీద కొంత పరిణామ చరిత్ర చెక్కబడివుందని, అది భౌతిక విషయంగా ప్రారంభమై, చిన్మాత్రమైనదిగా పరిణమించినదని పై పంక్తులలో ప్రస్ఫుటంగా తేల్చి చెప్పబడింది. ఆర్యుల పురాతనాధారాలంటే వేదసంహితలని గ్రహించడం కష్టతరంగాదు; వివాదగ్రస్తం కాదుకూడా! అనగా వైదిక సాహిత్యంలో ఆర్యుల ఆత్మ భావన యింకా ద్రవ్యాత్మకంగావుందని వారి

అభిప్రాయ మన్నమాట. దానినే మున్ముందు పరామర్శ చేయ వలసివుంది.

ఇక్కడొక ప్రస్తావనను పాఠకులు మన్నించవలసి వుంటుంది. పాశ్చాత్యపండితులు ఆత్మజ్ఞానం భౌతిక విషయంగా బయల్వెడలి భావనా విషయంగా పరిణమించిందని నిరూపించడంలో మరో సూక్ష్మరహస్యం యిమిడివుంది. భౌతికమయమైన భావన మానవుని మేధస్సులో శైశవావస్థను సూచిస్తుందని, కాగా భావవాదసరళి మేధోవికసనకు చిహ్నమని వీరు యీ పరిస్థితిపై తీర్పుయిస్తారు. ఇది సరికాదని, మానవుని ఆలోచన సహజంగా, స్వాభావికంగా, అజ్ఞాతంగానూ ప్రత్యాత్మకంగానే నడుస్తుందని, మేధోవికసన క్రమానుగతమైన దారులలో పడి, బుద్ధిబాహ్యమైన భావవాద పేటికలలో సామ్రాజ్యాలు స్థాపించిందని భౌతికవాదులనవలసివుంటుంది. బుద్ధివికాసం, నైశిత్యం మీరినకొలదీ భౌతికవాదం బలపడుతూ వుండడం, భావవాదం బక్కచిక్కడం యిందుకు తార్కాణం.

ప్రస్తావనవశంగా వచ్చిన యీ విషయాన్ని ముగించి విడిచిన కథను పూర్తిచేయాలి. భారత విషయాలపై భారతీయుని తీర్పు పరమపథ్యంగా ప్రీతిచేసినా, విదేశీ పండితుల అభిప్రాయాలనుకూడా అజలోకి తీసుకోవడం ఔచిత్యమనిపించుకొంటుంది. ఏ. బి. కీత్, మాక్డోనల్, ఋషిదేవిమున్న మహాశయులు వైదిక సాహితీ సాగరాన్ని మథించి, సాధించి వెలువరించిన మహాతత్వాలలో వొకటిగా ఆత్మవిషయంలోకూడా వివేకానందుని వలెనే నిర్ధారణ చేయడం ప్రముఖ విషయం. అద్వైతపక్షపాతి

అయిన మాక్సుముల్లరు పండితుడుకూడా అలాగే వ్యక్త పరచాడు.

"ఆత్మ ద్రవ్యాత్మకమైనదనేదే ఆదిలోని అభిప్రాయమని నిస్సందేహంగా చెప్పొచ్చు. ఈ దృక్పథముయొక్క చాయలు చాలా అనంతరకాలంవరకూ వూపిరి పోసుకుంటూ నిలబడే వున్నాయి."

["At first the conception may no doubt have been that it was material and traces of the view persist late...." Page 48, ఐతరేయారణ్యకం, ఎ. బి. కీత్.]

మాక్డోనల్ పండితుడు Vedic Mythology అనే గ్రంథంలో (పేజీ–116) అదే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. ఆయన వేద సంహితలనుగూర్చి సూటిగా చెప్పాడు. 'ఋషి డేవిడ్సు' తన 'Buddhist India' అనే గ్రంథంలో (పేజీలు–251, 252) అదేవిధంగా సూత్రీకరించాడు. ఆత్మభావం ఒకరకమైన ద్రవ్యమయ పురుషునిగా ('Some sort of material Homunculus') ప్రారంభమైనదన్నాడు.

(7) 'మాక్సు ముల్లర్' పండితుడు 'ఆత్మ' అన్న శబ్దం ఏ ఏ అర్థాలనుపొంది మారిందో చెప్పడానికి యత్నించారు.

"చాలచోట్ల ఆత్మ అంటే ఇంకా శ్వాసమనే అర్థం లభిస్తుంది" (Atman, in several places still means breath. 71 page)·

"ఆ తర్వాత అది ప్రాణం, జీవమనే అర్థంలోకి వచ్చింది." (It then came to mean vital breath; life') "ప్రాణం తర్వాత ఆత్మ అనే వర్తమానార్థంలోకి రావడానికి ఆట్టే ఎంతో లేదు, కాని అదికూడా వాస్తవికమైన దనడం కన్నా వ్యాకరణ సందర్భంవల్లనే అనాలి" (From soul there is but a small step to self and that step is often grammatical rather than real.) ఇందుకు ఉదాహరణగా 'బలమ్ దధానః ఆత్మని' (ix 113 - 1) అన్న వాక్యాన్ని యిచ్చారు. (71, 72 పేజీలు, 'Six Systems of Indian philosophy') ఋగ్వేదంలోనే గాక, యితర సంహితలలో కూడా ఆత్మ శబ్దం నానుకలో వున్న భావవాదార్థాన్ని పరిగ్రహించలేదని 'ముల్లరు' తేల్చి చెప్పారు.

ఇక 'ఆత్మ' శబ్దం యొక్క వ్యుత్పత్తి అర్థాన్ని, తత్సంబంధమైన మీమాంసను సంగ్రహంగా తెలుసుకుందాం. పాశ్చాత్య పండితుల్లో అధికాధికులు 'అన్' అను ధాతువు నుండి 'ఆత్మ' శబ్దం రూపు దిద్దుకుందంటున్నారు; కొందరు 'అత్' అను ధాతువునుండి అని అంటున్నారు. అత్ అను ధాతువు సంచరించే వాయువును సూచిస్తుందని, లేక జన్మాంతరాలను సంచరించే 'సాంసారికాత్మ'ను స్ఫురింప చేస్తుందని అంటారు. ఈ రెండింటిలో వేదసంహితలలో ఆత్మను, వాయు సదృశమైనదిగా విస్తారంగా చెప్పడంచేత, పునర్జన్మభావం అప్పటికి అంతగా తలయెత్తకున్నందున మొదటి అర్థాన్నే స్వీకరించవలసివుంది.

గీర్వాణభాషలోని 'ఆత్మన్', జర్మన్‌లోని 'ఆత్మెన్' (Athmen)తో వ్యుత్పత్తి సంబంధాన్ని కలిగివుందంటు

ఇది ఆయన దృక్పథమేగాదు, 'ఫ్రేజరు' మొదలు మానవశాస్త్ర వేత్తలందరి దృక్పథంకూడాను.

(2) 'దేహము - ఆత్మ' అనే ద్వైతభావం మానవుని మేధస్సులో అనాదిసిద్ధంగా పాదుకట్టుకొని వస్తూవుంది. అనగా ఆటవికస్థితి(Savagery) నాడే పాదుకొన్నదిగా వూహింపబూనడం సులభమే. అదీ నిజమే కాని ఆ వూహ ఆలోచనను మీరి చొచ్చుకుపోకుంటే, దాని నిజస్థితిని సమగ్రంగా ఆకళింపు చేసుకొన్నట్లు గాదు. మానవుడుగా పరిణతినందగల అంగనిర్మాణం లేని 'మూస్టీరియన్'* వానరులకే (ఫ్రాన్సులో లభించిన జాతి) ఈ ద్వైతభావం కుదిరివుంది. వారి గుహల్లో మృతకళేబరాలకు వొకమోస్తరు శిలాసమాధులు అమర్చబడినట్లు కానవచ్చింది. మనుషుగా పరిణతి పొందలేక నశించిపోయిన వానర మేధస్సుకే పట్టుపడిన విశ్వాస మిది కాగా, మరణానంతర జీవితాన్ని ప్రతిపాదించి విశ్వసించని ఆటవిక తెగలు చెదురు, అపురూపము. మరణానంతర జీవితంలో విశ్వాసం కుదుర్చుకోని తెగలుసైతం ఆత్మలో విశ్వసిస్తూనే వున్నాయి. మరణానంతర

---

* పురాతత్వ పరిశోధకులు ఫ్రాన్సులో యీ తెగను కనుగొని యిలా నామకరణం చేశారు. శవాల తలలక్రింద వొత్తుగా రాతి తలగడాలు అమర్చారు. చుట్టూరా, పైనా రాతిపేరుపు సమాధిగా పెట్టారు. పెచ్చురాళ్ళ (Flake type) ఆయుధాలను, మాంసపు చట్టలను ప్రక్కన వుంచారు. వారి నుదుళ్ళు బాగా పల్లంగా వుండి, దవడలు ముందుకుసాగి పుగ్ర. ఆకృతి పశువులను పోలివుంటుంది. శవాలను భద్రపరచడమంటే, ఆత్మభావం అనివార్యంగా వుండడమేగాక, ఆ భావం శుద్ధద్రవ్యమయంగాకూడా వుండన్నమాట.

జీవిత ప్రతిపాదనలేకుండా, ఆత్మలో నిశ్వసించే తెగలు దేహంతోపాటే అదీ నశిస్తుందంటారు. ఇదొక విచిత్రవిషయం. ఉదాహరణకు కెన్యా కొండవాళ్ళలో నివసించే తెగలు ఉత్తర నైగీరియాలో 'రోబా', ఉత్తర 'యుంగూర్' తెగలు అలాగే విశ్వసిస్తాయి మరికొన్ని తెగలయితే నిరుపేదల, పాపకర్మల యొక్క ఆత్మలు దేహంతోటే నశించి ధనవంతుల, పుణ్యాల ఆత్మలకు మరణానంతర జీవితం వుంటుందని నమ్ముతాయి. మరికొన్ని యిందుకు విరుద్ధమైన విశ్వాసంకూడా కుదుర్చుకొనివున్నాయి. మన దేశంలో మధ్యప్రదేశ్ లో 'బింజ్వార్'(Binghwar) అనే ద్రావిడ తెగ పాపుల ఆత్మలు బ్రతికి, పుణ్యులవే నశిస్తాయని నమ్ముతుంది. దేహంతోపాటు వెంటనే ఆత్మ నశించదనే తెగలుకూడా ఆత్మను అజరామరమని భావించవు. దేహంవలె ఆత్మ కూడా మరణధర్మంగలది అంటారు. ఐతే దేహం పతనంమాత్రం ముందని, ఆవెనుక మరొక కాలానికి ఆత్మ నశిస్తుందని అంటాయి. ఆత్మశాశ్వతమనే భావం అనంతర కాలంలో భావనాభివృద్ధివలన ఏర్పడింది. ఇంతకూ చెప్పవచ్చేదని – ఈ ద్వైత విశ్వాసం మానవావతరణతోనూ, వాస్తవముగా అంతకు ముందు నుండే ప్రారంభమైనదని, పైగా అది సార్వజనీనమని భావం.

ఈనిర్ణయం నేటివరకు మానుషశాస్త్రంలో అధికారికుల దృక్పథం. కాని ఆ శాస్త్రం రంగంలో చూసినా మరో ప్రత్యామ్నాయ దృక్పథం లేకపోలేదు. ఈ సందర్భంలో శ్రీ ఎ. బి. కీత్ మహాశయుని వుదాహరించడం ఉచితం.

"It is impossible to suppose, as is now so often done, that the earliest or even the early form

of religon was the belief in spirits which take up their abode from time to time in various forms. It cannot have been until long experi - ence that the idea of a disembodied spirit can have been intelligible. Primitive man must long have regarded body and mind as one "—Introduction to Aitareya Aranyaka (By A. B. Keith.)

దేహంతో అవినాభావసంబంధంలేని ఆత్మసంటిభావం ఆదిమంగాదని, దేహేతరమైన ఆత్మభావం పూర్వమానవుని కర్థంగావడమన్నది దీర్ఘానుభవంమీదగాని సాధ్యపడదన్నదే పైవాక్యాల సారాంశం తొట్టతొలుత మానవుడు మనోదేహాలను ఏకీకృతంగానే విశ్వసించాడన్నదే యీ వాదం. అసలు జడపదార్థాలను అర్థంచేసుకోనేలేదని, సర్వవిషయాలకు కృపా కోప ద్వేషాదులవంటి మానసిక లక్షణాలను గలవిగా చూశాడని తాత్పర్యం. జడ, చైతన్యాలు విభిన్నమనే 'ఉన్నత' జ్ఞానస్థాయిని దేహేతర ఆత్మభావం సూచిస్తుందని అనబడిందన్నమాట.

ఈ వాదన తార్కికంగా సత్యమని స్ఫురింపజేయినప్పటికీ వాస్తవ పరిస్థితులను గమనికలోకి గైకొన్నట్లయితే సత్యసామీప్యత లోపిస్తోంది. నేడున్న ఆటవిక తెగలలో యిటువంటి నమ్మకం కానరావడం మృగ్యం. పైగా కలలు జంతుజాలానికి సైతం వస్తాయని మానసిక శాస్త్రవేత్తల అనుభవం చెబుతోంది. అందుచేత వానరం మానవ మస్తిష్కాన్ని సంపాదించేసరికే స్వప్నానుభవం ఎంతో వుండగలదనడం స్పష్టం. ఏమాత్రం ఆలోచించడానికి అనుకూలించే అంగంగా వానర మస్తిష్కం వృద్ధిపొందినా యీ విశ్వాసం నెలకొనడం విశేషం

గాదు. పైగా యీద్వైతభావానికి ముందు ఆత్మ, మనోవ్యాపా రాలకు దేహంతో గల సంబంధ మేమిటన్న సమస్యే తట్టడానికి వీలుగలస్థాయి అతని కెక్కడ లభిస్తుంది?

ఈ వివాద పర్యవసానం ఎలా తేలినప్పటికీ మన ప్రస్తుత పరిశీలనకు, నిర్ణయాలకు నిమిత్తం వుండదు. ద్వైతభావానికి ముందొక దశ వున్నదా, లేదా అన్నదే యిందులోని మీమాంస. కాని ప్రస్తుత అవలోకనంలోని ప్రుద్దేశం ద్వైతం ఏర్పడ్డాక, ఆ ద్వైతంయొక్క స్వభావం ఎటువంటిదో కనుగోనడమేగదా!

(3) ఆటవికుల ఆత్మభావాలను అతిసూక్ష్మంగా అధ్యయనంచేసి మానుషశాస్త్రం, తత్స్వరూప నిర్మాణాలనుగూర్చి ఒకానొక స్థూలాభిప్రాయాన్ని వెలువరించింది. దానిని టైలర్ మహాశయుని వాక్యాలలో కనుగొందాము.

"It is a thin unsubstantial human image, in its nature, a sort of vapour, film or shadow".

"Among rude races, the original conception of the human soul seems to have been that of ethereality or vaporous materiality, which has held so large a place in human thought ever since." page 457.

∴ ఆత్మ మానవాకృతిలో వుండని, దాని స్వభావం సూక్ష్మవాయుక ద్రవ్యత్వమని దీనిభావం.

"As souls appear in dreams and visions, they were thought to possess thin bodies to be visible, to be moving, to be speaking".

దీనివల్ల ఆత్మలు సూక్ష్మశరీరమని సైతం తేల్చబడింది. ఆత్మకు, నీడకు (ఛాయకు)-ఆత్మకు, ఊపిరికి అనేక భాషలలో ఒకేమాట శబ్దం శ్లేషార్థాన్ని కలిగి వుండడాన్ని పుష్కలంగా గమనిస్తాము.

| | భాష | శబ్దం | అర్థాలు |
|---|---|---|---|
| 1. | అరవాక్ | 'యుఎజ' | ఛాయ, ప్రతిబింబం, ఆత్మ. |
| 2. | అబిపోన్సు | 'లోయకల్' | పైమాటితోపాటు ప్రతిధ్వని అనేది అదనపు అర్థం |
| 3. | జూలూస్ | 'టుంజి' | ఛాయ, ఆత్మ |
| 4. | బసుటోస్ | 'సెరితి' | ,, ,, |
| 5. | 'క్విచే' | 'నటుబ్' | ,, ,, |
| 6. | 'అల్గాంక్విన్స్' | 'ఓటహ్‌చుక్' | ,, ,, |
| 7. | పశ్చిమాస్ట్రేలియన్స్ | 'వంగ్' | ఊపిరి, ఆత్మ |
| 8. | 'నెటెలా' (కాలిఫోర్నియా) | 'పియుట్స్' | ,, ,, |
| 9. | 'జావానీస్' | 'నవ' | ,, ,, |
| 10. | 'హెబ్రూ' | 'నెఫెష్' | ,, ,, |
| 11. | అరబిక్ | 'నెఫ్స్', 'రుహ్' | ,, ,, |
| *12. | గ్రీకు | 'సైకే', 'న్యూమ' | ,, ,, |
| *13. | లాటిన్ | 'యనిమస్', 'యనిమ' 'స్పిరిటస్' | ,, ,, |

*14. స్లావోనిక్ 'దూచ్' " "
*15. జర్మన్ 'జీస్ట్' ఇవి అన్నీ శ్వాసననే
16. ఇంగ్లీషు 'ఘోస్టు' అర్థాన్ని కలిగివున్నాయని విజ్ఞులు తేల్చారు.
*17. 'జిప్సీ' 'దూక్' ఊపిరి ఆత్మ

ఆత్మను శ్వాసవాయువుగా భావించడం ప్రపంచంలో చాలా హెచ్చు. అది పునాదిగా అనేక ఆచారాలు రూపుగొన్నాయి. చనిపోనున్న వారి ముఖంలో ముఖం పెట్టించి పసిపిల్లలచేత వారి శ్వాసాన్ని పీల్పించి తద్వారా పిల్లలలో ఆత్మ ప్రవేశించిందని సంతోషించే నమ్మకం ప్రాచీన 'సెమినోకల్సు' తెగ మొదలు నాగరిక రోమును దాటినంతకు వుంది. నేడు మనదేశంలో తుమ్మినప్పుడు 'కృష్ణ' అంటాము. బౌద్ధ సాహిత్యంలో కూడా తత్ప్రసక్తి కద్దు. ఉపన్యసిస్తుండగా బుద్ధునికి తుమ్మువచ్చింది. వింటున్న శ్రోతృలోకమంతా 'జీవ, జీవ'♦అని ఉపశాంతి పదాలు వుచ్చరించారు. బుద్ధు డదిచూసి ఆ అలవాటును, దాని వెనుకనున్న నమ్మకాన్ని నిరసించి, వారించాడు. తన పరివ్రాజకులా అలవాటుకు లోనుగా రాదని విధించాడు. ఇదే అలవాటు రోమన్లకూ, గ్రీకులకూ వుండేవి. తుమ్ములో ఎక్కువశ్వాస పోవడమే అందుకు కారణం కావచ్చు.

(4) ఇంతవరకు మానుషశాస్త్రంలోని భావపరంపర పరిచితమైంది. ఇక తత్త్వప్రపంచంలోని పరిస్థితిని పర్యాలోకిస్తాము.

---

* ఆర్యభాషలలో ముఖ్యంగా ఆత్మశబ్దం శ్వాసంతోనే అర్థాన్ని కూడా కలిగిఉండటం గమనార్హం.

♦ "జీవతుభంతే భగవా, జీవతు సుఖినో" వినయపిటకం.

పాశ్చాత్య తత్త్వకుటుంబాన్ని మున్ముందుగా తీసికొందాము. 'ఎపిక్యురస్' మహాశయుడు పాశ్చాత్యులకు చార్వాకుడు. కల్తీలేని భౌతికవాదిగా ఆయనకు ఎన్నికవుంది. ఆయన ఆత్మ నంగీకరించాడు. అయితే ఆత్మ భౌతిక విషయం గానడం అని వార్యం, ఆవశ్యకం అని వక్కాణించాడు.

"Those who say the soul is incorporeal talk folly, for it could neither do nor suffer anything were it such"

దీనినిబట్టి నాటికే ఆత్మను ద్రవ్యరహితమైన శుద్ధచైతన్యంగా సూత్రీకరించేస్థితి గ్రీకు దార్శనికజగత్తులో ఏర్పడిందనిభావించాలి. అందుకే విశుద్ధచైతన్యమైన ఆత్మ నిష్ప్రయోజక మవుతుందని 'ఎపిక్యురస్' విమర్శ. ఆలోపనివారణకు ఆత్మమూలంలోపదార్థం గావలసివుంటుందని ప్రతిపాదించాడు. భౌతికవాదియైన యీాయన ఆత్మనంగీకరించాడన్నది ఆధునికుణ్ణిఆశ్చర్యచకితుణ్ణి గావించవచ్చు గాని, ఏతత్ప్రతిపాదనానంతరం దానిని ద్రవ్యమయంగా వూహించాడని తెల్సుకోవడం విశేషం. ఆయన ఆత్మ శాశ్వతా వాదాన్నికూడా ఖండించాడు. మళ్ళీ ఆత్మ దేహంతోపాటుగా నశిస్తుందని అనలేదు. మరణానంతరం దైహికస్పర్శ ఆత్మకు కొరవడుతున్నందున ఆత్మాణువుల్లో అనుభూతి సంజ్ఞ, జ్ఞానం కలుగనేరక చేతనారహిత మవుతుందన్నాడు. చేతనారహిత మైనది లేనట్లే లెక్క. అగ్ని, శ్వాసల అణువుల కూడిక ఆత్మ. (శ్వాస వాయువుకన్నా భిన్నమంటాడు ఆయన). ఈ అణువులు దేహమంతటా పర్యాప్తమైవుంటా యన్నాడు.

(2)



విశ్వపరిణతికి మూలద్రవ్యం వాయువని ప్రతిపాదించిన 'ఎనగ్జమనీస్', ఆత్మనుకూడా సూక్ష్మతమవాయు వన్నాడు. 'స్పిరిట్'(spirit) అనే ఇంగ్లీష్ శబ్దానికి అర్థం సూక్ష్మవాయువే. జగదాద్యపదార్థం 'అగ్ని' అని సూత్రీకరించిన 'హిరాక్లిటస్' ఆత్మను అత్యంత సూక్ష్మమైన అగ్ని అన్నాడు. ఇంగ్లీషు భాషలోని 'క్వింట్ ఎస్సెన్సు' (Quint Essence) అనే శబ్దం కూడా 'హిరాక్లిటస్' మహాశయుని భావననే పొదవుకొన్నది. ఆశబ్దం ఆత్మను ఐదవ సారాంశంగా సూచిస్తుంది. చతుస్సారాలు ఆకాశం మినహాగా తతిమ్మా చతుర్భూతాలు కాగా, పంచమసారం ఆత్మ – సూక్ష్మతమాగ్ని.

అయోనియన్ తాత్త్వికుల్లో గణితనిష్ణాతులై తత్త్వభావం తమ తత్త్వచింతనపై ప్రసరింపజేసుకొన్నవారు 'ఎనగ్జిమాండర్', 'పైథాగరస్' మహాశయులు. వీరు చతుర్భూతాలలో దేనినో ఒకదానిని ఎన్నిక జేసి జగన్మూలద్రవ్యమని నామకరణంచేసే ధోరణికి వేరయ్యారు. గణితస్వభావానికి తగ్గట్టుగా వస్తు నిర్దేశాన్ని విడనాడి ఒకానొక (abstraction) కు ప్రవచించారు. అందులో ఒకరు మూలపదార్థం 'అనంతం' అన్నారు; వేరొకరు 'సంఖ్య' అన్నారు. ద్రవ్యనిర్దిష్టతకు దూరమైన్యే ధోరణిని ప్రవేశపెట్టిన వీరుకూడా ఆత్మను పాదార్థికంగానే ఊహిస్తూ వచ్చారు. ఇందులో 'పైథాగరస్' మహాశయుడు పునర్జన్మలో విశ్వసించినవాడు. ఆయనఆత్మను 'ఈథర్ ఖండము'(chip of the Ether) గా వ్యూహించాడు. ఆయన అవగాహనలో 'ఈథర్' అనగా ఆవిరి. 'ఎంపెడోకిల్స్' అనేఆయనకూడా పునర్జన్మను బోధించినవాడే. ఆత్మస్వభావం విషయంలో ఆయన భావన అక్షరాల 'పైథాగ

రస్'దేగాని భిన్నంకాదు. నాకు అర్హత చాలకపోవచ్చునేమో గాని, ప్రాచీన గ్రీకు మహాదార్శనికులలో పేరెన్నికగన్న భౌతిక వాదులందరూ విడువకుండా ఆత్మభావంలో విశ్వాసమున్నవారే నన్నది సత్యాసన్నమైన విషయంగా చెప్పొచ్చు. బహుశా, దేహాంతరంగా ఆత్మ అంటూ లేనే లేదన్నవాడు ప్రాచీన గ్రీకు తత్త్వ ప్రపంచంలో లెక్కకొక్కరుకూడా లేరనవచ్చును. అనగా గ్రీకుతత్త్వ శాస్త్రంలో దేహాత్మవాదం లేదన్నమాట.

మరోవిషయాన్ని పరికించుదాము. భావవాద చక్రవర్తి అనదగిన 'ప్లేటో' మహాశయుడుకూడా ఆనాటికి ఆత్మను విశుద్ధ చేతనంగా నిర్వచించలేకపోయాడు. "The soul is compounded of the indivisible - unchangeable and the divisible - changeable; it is a third and intermediate kind of essence" -[Russel's Histroy of W. Philosophy]. ఇక గ్రీసులో ఆత్మను, చైతన్యాన్ని విడదీయ ప్రారంభించినవాడు 'అరిస్టోటిల్' మహాశయుడు. ఆత్మ దేహంతో నశిస్తుంది. కాని ఆత్మలో ఒక భాగంలో సంస్థితమైన మనస్సు (Mind - చైతన్యం) మాత్రం మరణించదు. ఆ మనస్సుయొక్క వ్యాపారమేమంటే భావన; గణితాన్ని, తత్త్వశాస్త్రాన్ని సమాలోచించడం; అది అజరామరం. దేహంలోని చలనాలకు, యింద్రియ గోచర విషయాలను పరిశీలించడానికి మాత్రమే అయితే అంత దనుక అందరూ భావించిన ఆత్మ సరిపడుతుంది. అది దేహంతో మరణించినా ప్రమాదంలేదు. పాదార్థికమైనది మరణించాలి గదా! అమృతత్వం గావాలంటే భావనాత్మక విషయంగావాలి అన్నతర్కమే 'అరిస్టోటిల్' దృష్టిలో యిమిడి వున్నది.

ఇక మధ్యయుగమంతా ప్లేటో, అరిస్టోటిల్ మహా మహుల ఆత్మభావాలలోని మంచిచెడ్డల ఖండన మండనలతో యిరువాగులుగా తాత్త్వికులు చీలి సంకుల సమరం సాగించటంలో తెల్లవారింది. చైతన్యాన్ని, భావనను ఆత్మయొక్క - సంరక్షకత్వంనుండి తప్పించబూనడం పదహారో శతాబ్దంనుండి సాగి, జయప్రదమైంది. ఒకవైపున 'డీకార్టే' ఆత్మను ద్రవ్యరహితమైన దానిగా పోతబోశాడు. నాటినుండి ద్వైతం స్థూల సూక్ష్మద్రవ్యాల మధ్యగాకుండా విశుద్ధచేతనం, ద్రవ్యాలమధ్యకు రంగ స్థలాన్ని మార్చుకొన్నది.

(5) పైనన్నీ ప్రాచీనతాత్త్వికుల అభిప్రాయాలు. ఆ ప్రాచీనుల భావజాలంపై అధునాతనులైన తత్త్వచరిత్ర శోధకుల కొలగారం నడచిన తీరుతో పరిచయం పొందడం శ్రేయస్కరం. కాని సంక్షిప్తమైన, సవిమర్శకమైన చక్కని రచన ఒకదానినుండి ప్రస్తుతం పొందుపరుస్తాను. 'రస్సెల్', 'లీవిస్' (Lewis, G. H.) 'బర్నెట్' వంటివారంతా యిదే ధోరణిని అవలంబించారని ఒక మాట చెప్పదలచాను.

"పూర్తిగా అధునాతనార్థంలో కాకపోవచ్చునుగాని, సోక్రటీసుకు మున్నటివారందరూ ప్రధానంగా భౌతికవాదులు. జీవద్ద్రవ్యానికి, నిర్జీవద్రవ్యానికి మధ్యవారెట్టి విస్పష్టమైన భేదాను చూడలేదు; కాని ఆత్మ ద్రవ్యమయ విషయంగానే విశ్వసించబడింది." – 26 వ పేజీ.

"గమనించవలసిన రెండో విషయ మేమంటే యూగ్రీకులందరూకూడ భౌతికవాదులే. ద్రవ్యరహితమైనదైవాన్ని

గూర్చిగాని, ద్రవ్యరహితమైన ఆత్మ, శక్తులను గూర్చిగాని వారి కొక అభిప్రాయమంటూ ఏర్పడనేలేదు."– 20 వ పేజీ.

"ఆత్మలు, దేవతలతో సహా జగత్తుఅంతా కాల ప్రదేశ గతమైవుండే వొకేవొక పదార్థం (Substance)తో నిర్మించ బడివుంది. ఆ పదార్థం ద్రవ్యమయం (Material)".– 22, 23 పేజీలు.

(From Philosophy for Pleasure, by Hector Hawton.)

నాకు తెలిసినంతలో క్లుప్తమైన యీ అంచనాలు పాశ్చాత్యతత్వ చరిత్రకారులలో నిర్వివాదమైనవి. ఈ విషయంలో శ్రీ హాటన్ కొత్తదనంకై పరుగెత్తిందిలేదు. * ఇంతటితో పాశ్చాత్య దార్శనికపరిశోధనా పరిశీలనను ముగించబోయే ముందు ప్రస్తావించిన విషయ సారాంశాన్ని క్రోడీకరించుతాను. ఆత్మభావం జననములో, శైశవములో ద్రవ్యాత్మకంగా ముగ్ధంగా ఊహించ బడింది. బాల్యావస్థనుండి క్రమంగా యౌవన ప్రాగల్భ్యాన్ని వడసింది. ద్రవ్యరాహిత్యంతో ప్రౌఢిమను సంతరించుకొన్నది. ఈ ప్రౌఢిమకు మరపురాని మచ్చగా ద్రవ్యాత్మక దేహంతోడి సంబంధ, సంపర్కాలు అనివార్యమై మిగిలి కలవరపరుస్తుంటాయి. కాని, ఆ ప్రౌఢాత్మ తనలోని సకలాన్ని మరచి గురివెందగింజలా నంగనాచి బ్రదుకును వెళ్ళమార్చడానికి సదా యత్నంలోనే వుంది.

---

* మార్క్సిస్టుదార్శనికులు ప్లెఖనోవ్, బుఖారిన్‌లుగూడా యిదే అభిప్రాయాన్ని అభివ్యంజనం చేశారు.

(6) ఇక నీ నేపథ్యభూమికను విరమించి. భారతీయ తాత్త్విక రంగస్థలంమీద యవనికను పైకెత్తాను. ముందుగా శ్రీ వివేకానందస్వామిని ప్రవేశపెట్టడం శుభారంభమవుతుంది. భారతప్రతిభ మూర్తీభూతమైన మహానుభావుడుగా యీయనను పరిగణనకలిగింది. ఈయన అద్వైతప్రసక్త. పశ్చిమఖండాలకు ప్రయాణించగల్గినందున పర భావనా వాహికల వొడ్డులపై నడచుట తటస్థించినది. ఇది వీరి రచనా, ప్రసంగాలనుండి గ్రహించగలం. 'ఆత్మస్వభావం-దానిగమ్యం' (Nature of the Soul and its Goal - Vol. VI, Works of Vivekananda.) అనేవాకవ్యాసాన్ని గమనించవలసివుంది. అవ్యాసంలో ఈజిప్షియనుల ఆత్మభావాలుకూడా అవలోడన చేయబడ్డాయి. ఈజిప్షియనులు దేహపతనానంతరం ఆత్మ కొంతకాలం మనుతుందని. దేహంగాయపడినా క్షతమైనా ఆత్మకూడా అలాగే క్షతమవుతుందని విశ్వసిస్తారని అన్నారు. "ఇక ఆర్యభావనను గమనించుదాం. ఒక్కమాటుగా మనకోపెద్ద తారతమ్యం కానవస్తుంది. ఇక్కడ కూడా ఈజిప్షియనుల ఆత్మవుంది. కాని అవాక భావనాత్మక శరీరంగా (Spiritual body) వుంటోంది." ఈవిధంగా భారతీయుడుగా ఆనవాయితీగా స్వాతిశయవచనాలు చదివిన తర్వాత వాస్తవస్థితిని చిత్రిస్తారు.

"ఈజిప్షియనులలోవున్నటువంటి ఆత్మభావన అతి పురాతన యుగంలో ఆర్యులు తమంతతాముగానే కలిగి వుండడానికి, లేదా కలిగి వుండొచ్చుననడానికి బాగా అవకాశంవుంది. అత్యంత

పురాతనమైన వారి ఆధారాలను అధ్యయనం చేసినట్లయితే ఈ అభిప్రాయముండడానికిగల అవకాశాన్ని పరికించగలం. మానవుడు మరణించినప్పుడీఆత్మ పితరులమధ్య నివసించడానికి వెళ్ళిపోతుంది. అక్కడ పితరుల సుఖాలను అనుభవిస్తూ జీవిస్తుంటుంది."

"అనంతర మీ భావన ఉన్నతపథాల కందుకుంటుంది. అంతకుముందు వారు ఆత్మ అనుకొన్నది వాస్తవంగా ఆత్మకాదని తెల్సుకోసాగారు. ఈ తేజశ్శరీరం, సూక్ష్మశరీరం – ఎంత సూక్ష్మాతి సూక్ష్మమైన దైతేనేమి? అదీవొకశరీర (Body)మే; శరీరమన్నది స్థూలమో సూక్ష్మమోగాని ద్రవ్యరాశితో తయారైందే కావాలి. స్వరూపమో, ఆకారమో గలదల్లా పరిమితమైనదిగావాలి; శాశ్వతం గాజాలదు. స్వరూపమన్నదానిలో పరిణామం నైజధర్మంగా వుంటుంది. పరిణామశీలమైనది శాశ్వతమెలా కాగల్గుతుంది? ఈ ఆక్షేపణతో యీ తేజశ్శరీరాన్ని అలాగే వుంచి దానివెనక మానవుని నిజమైన ఆత్మను కనుగొన్నారు ... ఆ విధంగా అసలు ఆత్మభావన ప్రారంభమైంది." (18 వ పేజీ, వివేకానంద గ్రంథావళి, ఆరోసంపుటం.)

ఆత్మభావాన్నిగూర్చి భారతార్యుని మేధః ఫలకం మీాద కొంత పరిణామ చరిత్ర చెక్కబడివుందని, అది భౌతిక విషయంగా ప్రారంభమై, చిన్మాత్రమైనదిగా పరిణమించినదని పై పంక్తులలో ప్రస్ఫుటంగా తేల్చి చెప్పబడింది. ఆర్యుల పురాతనాధారాలంటే వేదసంహితలని గ్రహించడం కష్టతరంగాదు; వివాదగ్రస్తం కాదుకూడా! అనగా వైదిక సాహిత్యంలో ఆర్యుల ఆత్మ భావన యింకా ద్రవ్యాత్మకంగావుందని వారి

అభిప్రాయ మన్నమాట. దానినే మున్ముందు పరామర్శ చేయ వలసివుంది.

ఇక్కడొక ప్రస్తావనను పాఠకులు మన్నించవలసి వుంటుంది. పాశ్చాత్యపండితులు ఆత్మజ్ఞానం భౌతిక విషయంగా బయల్వెడలి భావనా విషయంగా పరిణమించిందని నిరూపించడంలో మరో సూక్ష్మరహస్యం యిమిడివుంది. భౌతిక మయమైన భావన మానవుని మేధస్సులో శైశవావస్థను సూచిస్తుందని, కాగా భావవాదసరళి మేధోవికసనకు చిహ్నమని వీరు యీ పరిస్థితిపై తీర్పునిస్తారు. ఇది సరికాదని, మానవుని ఆలోచన సహజంగా, స్వాభావికంగా, అజ్ఞాతంగానూ ద్రవ్యాత్మకంగానే సాగుస్తుందని, మేధోవికసన కృత్రిమమైన ధోరణిలో పడి, బుద్ధిజాడ్యమబ్బి భావవాద వీచికలలో వొయ్యారాలు పోతుందని భౌతికవాదు లనవలసివుంటుంది. బుద్ధివికాసం, నైశిత్యం మీరినకొలదీ భౌతికవాదం బలపడుతూ వుండడం, భావవాదం బక్కచిక్కడం యిందుకు తార్కాణం.

ప్రస్తావనవశంగా వచ్చిన యీ విషయాన్ని ముగించి విడిచిన కథను పూర్తిచేయాలి. భారత విషయాలపై భారతీయుని తీర్పు పరమపథ్యంగా ప్రీతిచేసినా, విదేశీ పండితుల అభిప్రాయాలనుకూడా అజలోకి తీసుకోవడం ఔచిత్య మనిపించుకొంటుంది ఏ. బి. కీత్, మాక్డోనల్, ఋషిదేవిడ్సు మహాశయులు వైదిక సాహితీ సాగరాన్ని మథించి, సాధించి వెలువరించిన మహాతత్త్వాలలో వొకటిగా ఆత్మవిషయంలోకూడా వివేకానందుని వలెనే నిర్ధారణ చేయడం ప్రముఖ విషయం. అద్వైతపక్షపాతి

అయిన మాక్సుముల్లరు పండితుడుకూడా అలాగే వ్యక్త పరచాడు.

"ఆత్మ ద్రవ్యాత్మకమైనదనేదే ఆదిలోని అభిప్రాయమని నిస్సందేహంగా చెప్పొచ్చు. ఈ దృక్పథముయొక్క ఛాయలు చాలా అనంతరకాలంవరకూ వూపిరి పోసుకుంటూ నిలబడే వున్నాయి."

["At first the conception may no doubt have been that it was material and traces of the view persist late...." Page 48, ఐతరేయారణ్యకం, ఎ. బి. కీత్.]

మాక్డోనల్ పండితుడు Vedic Mythology అనే గ్రంథంలో (పేజీ-116) అదే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. ఆయన వేద సంహితలనుగూర్చి సూటిగా చెప్పాడు. 'ఋషి డేవిడ్సు' తన 'Buddhist India' అనే గ్రంథంలో (పేజీలు-251, 252) అదేవిధంగా సూత్రీకరించాడు. ఆత్మభావం ఒకరకమైన ద్రవ్యమయ పురుషునిగా ('Some sort of material Homunculus') ప్రారంభమైనదన్నాడు.

(7) 'మాక్సు ముల్లర్' పండితుడు 'ఆత్మ' అన్న శబ్దం ఏ ఏ అర్థాలనుపొంది మారిందో చెప్పడానికి యత్నించారు.

"చాలచోట్ల ఆత్మ అంటే ఇంకా శ్వాసమనే అర్థం లభిస్తుంది" (Atman, in several places still means breath. 71 page):

"ఆ తర్వాత అది ప్రాణం, జీవమనే అర్థంలోకి వచ్చింది." (It then came to mean vital breath; life') "ప్రాణం తర్వాత ఆత్మ అనే వర్తమానార్థంలోకి రావడానికి ఆపైన ఎంతో లేదు, కాని అదికూడా వాస్తవికమైన దనడం కన్నా వ్యాకరణ సందర్భంవల్లనే అనాలి" (From soul there is but a small step to self and that step is often grammatical rather than real.) ఇందుకు ఉదాహరణగా 'బలమ్ దధానః ఆత్మని' (ix 113 - 1) అన్న వాక్యాన్ని యిచ్చారు. (71, 72 పేజీలు. 'Six Systems of Indian philosophy') ఋగ్వేదంలోనే గాక, యితర సంహితలలో కూడా ఆత్మ శబ్దం సూచికలో వున్న భావనార్థాన్ని పరిగ్రహించలేదని 'మ్యుల్లరు' తెల్పి చెప్పారు.

ఇక 'ఆత్మ' శబ్దం యొక్క వ్యుత్పత్తి అర్థాన్ని, తత్సంబంధమైన మీమాంసను సంగ్రహంగా తెలుసుకుందాం. పాశ్చాత్య పండితుల్లో అధికాధికులు 'అన్' అను ధాతువు నుండి 'ఆత్మ' శబ్దం రూపుదిద్దుకుంటున్నదని; కొందరు 'అత్' అను ధాతువునుండి అని అంటున్నారు. అత్ అను ధాతువు సంచరించే వాయువును సూచిస్తుందని, లేక జన్మాంతరాలను సంచరించే 'సాంసారికాత్మ'ను స్ఫురింపజేస్తుందని అంటారు. ఈ రెండింటిలో వేదసంహితలలో ఆత్మను, వాయు సదృశమైనదిగా విస్తారంగా చెప్పడంచేత, పునర్జన్మ భావనం అప్పటికి అంతగా తలయెత్తకున్నందున మొదటి అర్థాన్నే స్వీకరించవలసివుంది.

గీర్వాణభాషలోని 'ఆత్మన్', జర్మన్‌లోని 'ఆత్మెన్' (Athmen)తో వ్యుత్పత్తి సంబంధాన్ని కలిగి వుందంటు

న్నారు. ఈ రెండుశబ్దాలకు మూలధాతువు 'అన్' అయివుంది. 'అన్' అనగా శ్వాసించుట. 'ఆత్మన్' అనగా శ్వాసము, ఊపిరి. ప్రాణశబ్దంకూడా 'అన్' ధాతుభవమనునది సులభంగా గ్రహించవచ్చు (ప్ర + అన్). ఆవిధంగా 'ఆత్మన్', 'ప్రాణం' రెండు శబ్దాల వ్యుత్పత్తి ఒక్కటిగావడం విశేషం, గమనించదగ్గది. [కీత్ మహాశయుడు యీ రెండింటిలో దేనితోను తృప్తిపడ లేదు. వేదంలో 'త్మనా' అనేశబ్దం 'ఆత్మన్'కు మారుగా ప్రయోగింపబడింది. ఋక్సంహిత అంతటిలోనూ యీ రూపాంతరం 78 మార్లకుపైగా ప్రయోగంలో వుంది. పై రెండు ధాతువులు'త్మనా' రూపాంతరానికి వివరణ యివ్వజాలవు. ఈవివరణ లభించేవరకు 'ఆత్మన్' వ్యుత్పత్తిని కనుగొనడం పూర్తిగా అస్పష్టమంటాడు'కీత్']. ఇదేసందర్భంలో గత విషయాన్ని గుర్తుచేస్తాను. ఆర్యభాషలలో ఆత్మకు తుల్యమైన శబ్దాలకు శ్వాసఅనే అర్థం వుందని గమనికలో పెట్టుకోవాలని లోగడ చెప్పుకొన్నాం. 'అన్' అనే ధాత్వర్థం అందుకు సరిపోయినట్టిది. ఏమైనా ఈరెండు ధాత్వర్థాలు భౌతికవాద ఫణితిలో నడిచాయని చూస్తున్నాం.

(8) అనంతరకాలంలో ఆత్మభావం ఆర్జించుకొన్న భావవాద లక్షణాలకు ఋక్సంహితలోనే ప్రాతిపదికలో, రూపురేఖలో ఏర్పడి వున్నాయని నిరూపించడానికి శ్రీ హెచ్. జి. నరహరి 'ఆత్మ' (Atman) అనే సద్గ్రంథంలో ప్రయత్నించారు. కాని వారు పరిశ్రమకు తగ్గఫలితాన్ని సాధించలేరు. ఆత్మను (పరమాత్మను) అద్వైతులు సచ్చిదానందమంటారు. అందుకు తగ్గట్టుగా సంహితలో ఛాయలున్నాయి చూపుమంటు

న్నారువారు. శ్రీ నరహరి ఆనందరూప మనేందుకు సంహిత సర్వం గాలిస్తే ఆయనకు లభించింది వొక్కేవొక సందర్భం. అది "ఆత్మ ఏవ శేవో దిధిశోర్యోభూత్".(1-74-2బుక్) కొండను త్రవ్వి దొరికిందనుకొన్న యీ 'ఎలుకను' పరిశీలిస్తే, అది కాస్తా ఎలుకకూడా కాకుండా పోయింది. ఈ వాక్యార్థం ఆత్మ ఆనందానికి ఆశ్రయం, స్థానంఅనే గాని ఆనందస్వరూపం అన్నదేమీ కాదు. మనచేష్టలకు, చేతనకార్యాలకు కారణమైన వస్తువే, అనగా కర్త, కర్మ ఫలితాలను అనుభవించే స్థానం కాకుంటుందా? సంతోషానికి స్థానమెంతో, దుఃఖానికీ అంతే. ఇంతేగాక, ప్రాతిపదికలను అన్వేషించడమంటే అర్థం, కొన్ని లోపాలతో; పరిమితులతో ఆభాసం పూసల్లో దారంవలె కొన్ని స్థలాలలో, తరచుగా వాడుక కెక్కినదానో, కాదో చూడాలి. అంతేగాని, గుడ్డివాడు గూటిలో వేసిన రాయినంటి దాక యాదృచ్ఛిక ప్రయోగాన్ని పట్టుకొని ప్రయోజనంలేదు. దేహేంద్రియాలతో సంపర్కాన్ని కల్గివున్నప్పుడే స్వయంగా జడమైన ఆత్మ (న్యాయవైశేషికాలు) సుఖదుఃఖాలకు స్థానమై వుంది. ఆనందానికి స్థానమంటే అది ద్రవ్యాత్మ గావాలి. ఇక 'ఆత్మ' శబ్దం చేతనార్థంలో (ప్రజ్ఞ-Intelligence) వాడబడినట్లొక సందర్భాన్ని కనిపెట్టి లెక్కించారు. కాని దానికీ అంగవైకల్యం, వైకృతం వుండి నిలబడలేకుంది. "భూమ్యా అసురసృగాత్మా" (1-64-4) అనే దానిలో 'అసుః' కన్నా ఆత్మను వేరుగా భావించినప్పటికీ అది 'భావనాసూత్రం'గా (Thinking principle) అర్థమివ్వడం లేదంటూరు మాక్స్ ముల్లరు పండితులు- "Where was the breath, the

